ఓంనమః పరమాత్మనే.

# శ్రీ విశ్వేశ్వరశతకము



రచయిత

కవికోకిల, విద్వాన్.

వేమూరి వెంకటరామయ్యశర్మ.

పరిష్కర్తలు

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు

శతావధానులు.



మినర్వా ప్రెస్, బందరు.

ఓంనమః పరమాత్మనే.

# శ్రీ విశ్వేశ్వర శతకము.



రచయిత

కవికోకిల, విద్వాన్

వేమూరి వెంకటరామయ్యశర్మ.

పరిష్కర్తలు

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు

శతావధానులు.

# తొలిపలుకు.

ఈ నవయుగమున, శతకరచనమున కుత్సహించు కవులరిది. శతకము నందలి పద్యములన్నియు నేక ప్రాసయుతములై యుండు నియమముతో శివలీలాగాథలను స్మరణమునకుఁ దెచ్చుచు భక్తి ప్రవాహమును వెల్లిగొల్పు నీశతకమునకుఁ గర్త, కవికోకిల, విద్వాన్, వేమూరి వెంకటరామయ్యశర్మ.

కర్తనుగూర్చియు, కారయితనుగూర్చియు పాఠకులకుఁ దెల్పుట సముచితము గాకపోదు.

కృష్ణా గుంటూరూభయ గోదావరీ నెల్లూరు మండల భక్తిప్రచారకులును, అభినవప్రహ్లాద, భాగవతకులాలంకార, పరమభాగవతాగ్రగణ్య, భక్తకులశేఖర, భక్తిమూర్తి, భక్త్యుపన్యాసకేసరీత్యాదిబిరుదాంకితులును, మధురవాగ్విశారదులునగు బ్రహ్మశ్రీ ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు శ్రీసనాతన భాగవత భక్తసమాజ స్థాపకులగుటంజేసి విష్ణుభక్తులని జగము భ్రమియించు. వారికి శివకేశవులు సములు.

తొల్లి శ్రీరామచంద్రుండు రామేశ్వరమున శివాలయప్రతిష్ఠ యొనరించి తరించినట్లు శ్రీ శాస్త్రులుగారు శివప్రతిష్ఠయొనరింపఁ దలంపుఁ గొనియుండ, సంకల్పమాత్ర తత్క్షణసాఫల్య మొనరుప, సత్తెనపల్లితాలూకా నుదురుబాడు నివాసులగు రెడ్డిమహాశయులు, అందునను శ్రీపానకాలు రెడ్డిగారు సకలభారముంబూని సైదోడయి యాలయనిర్మాణాదికములను నిర్వహించిరి

వారణాసినుండి శ్రీవిశ్వేశ్వరుఁడు పలనాటికి విచ్చేయు శుభోదర్కమగు నీసమయమునకే మా శిష్యుడైన కవికోకిల కృతిసమర్పణము మిక్కిలి చరితార్థమైనది.

శతక కర్తను గూర్చి యొండురెండు పల్కులు స్తుతియని భావింపకుందురుగాత.

ధూర్జటి మహాకవి రచియించిన శ్రీకాళహస్తీశ్వర శతకమునకు నీశతకము తుల్యమని నా యభిప్రాయము.

శ్రీ విశ్వేశ్వరస్వామి గ్రంథకర్తకు నష్టైశ్వర్యముల నొసంగి కాపాడుఁగాత.

ఇట్లు,

విద్వాన్, నందుల సుబ్బరాయశర్మ.

ప్రథానాంధ్రాధ్యాపకుఁడు, స్థానికోన్నతపాఠశాల, కైకలూరు.

ఓం నమః పరమాత్మనే.

# శ్రీ విశ్వేశ్వర శతకము.

శ్రీనారాయణ నామచింతన సుధాసేవారతిం దన్మయుం
డై నారాయణి కావిశేషరుచులింపై తోఁప ఝుంకారని
స్వానంబుంబొనరించు శ్వేతమధుపస్వామి న్నినుం గొల్తు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ఏనాఁడావిధి యుష్మదీయకరుణావృష్టుల్ ప్రవర్షించెఁ దో
స్తో నాకిచ్చు జనించె నీకు శతశార్దూలార్చఁ గావింప నా
పై నీభారము మన్మనోరథము సాఫల్యంబుఁ గావింప ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ఆనాయంబున మీనముట్లు లిహభోగానందమే బ్రహ్మమం
చే నాశించి భవాబ్ధిఁ జిక్కితిని కామేచ్ఛన్ విధిం దీరముం
గానంజాల భవత్పదాబ్జతరణిం గానంత యందిమ్ము ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

కానన్లేము గదయ్య నీదగు కటాక్షశ్రీ యెటన్ వ్రాలునో
యీ నాఁటంగుదురయ్యె నీనుదురుబా డీపారపుణ్యమ్మొ స
మ్మానార్హుఁడగుపానకాల్ సుకృతమో మత్స్వామి నిందెచ్చె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

మేనంజెమ్మట లోడ నోర్చి మనుమిన్నైనఁ గ్రిందైన ల
క్ష్మీనారాయణశాస్త్రి వర్యుపదమే శ్రేయంబుగా నెంచి గ్రా

మాన న్నీకుఁ బ్రతిష్ఠ సల్పు జనసమ్మాన్యత్వ మగ్గింతు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ఏమంగెక్కఁగ నిచ్చగింప మదినూహింపంగఁబో నష్టభో,
గానందమ్ములఁదేల, రాచఱికమే నర్థింప నోయన్న చి
త్తాన న్నీపదపద్మసీధువును నిత్యం బానమిమ్మంటి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీనామమ్ము పఠించు భక్తులకథల్ నీభక్తసంరక్షణ
త్రాణం దెల్పునటంచుఁ జెప్పుటకు నారంభించితిం గృత్తివా
సా! నిన్నుస్థిరభక్తి వేఁడుదు పునర్జన్మంబుఁ దప్పింపు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

కానంగాఁపురమా యరణ్యమ్మృగముల్ గైసేయుకాల్పంటులా
యానీతంబగు బోయచేతిపలలం బాహారమా పుక్కిటం
దానంబా కనుఁగొంచుమోక్షపదవీదానమ్ములా మేలు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

త్రాణల్ గొల్చెడు నీసహస్రకమలార్చం దక్కువొక్కండుగాఁ
బూనెన్ స్వాక్షిసరోజమిచ్చి నినుఁ దృప్తుంజేయఁబద్మాక్షుఁడా
వైనం బెంచి సుదర్శనం బసురులన్ భంజింపఁగా నీవె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

దీనుండై పొలలేమి బోయ శివరాత్రిన్ శ్రీఫలంబెక్కి తా
నేణమ్ముం గురిసేయఁ దిత్తియుదకం బింతింత నీపైఁబడన్
వాని న్ముక్తునిఁజేయ నర్బుదగిరిన్ వ్యాధేశ్వరుండైతి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

సానిం దన్పఁగ నొజ్జ యుంగ్రమ్ము ద్వదర్చాభుక్తియుంగొంచు దు
ర్మానుండై యలనాఁడు వేదనిధి సేరన్వచ్చుచో నారెకు
ల్వానింజంపఁగ నీదు సన్నిధిమహత్వంబిచ్చె మోక్షంబు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

తానంబుం గొన నూఁగు తారకుని దైత్యశ్రేణిలోఁ దున్మఁప గీ
ర్వాణు ల్శక్తులుగాక నీపదము సేరఁ భక్తరక్షార్థమై
నీనేమంబులు వీడి పార్వతిని ముంజే పట్టినావంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

కానంజాలఁడు మంచు నుత్తమగతుల్ గన్నారఁగా నీదు క
ల్యాణంబుం గన లోకమొక్కటెదెన వ్రాలన్ భూమి క్రుంగం దయా
ధీనత్వమ్మునఁ గుంభజుం బనిచి యాత్రిం దోయఁగా లేదె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

కానన్వచ్చిన వారియందు రతినొక్కటిన్ విషాదాశ్రు సం
తానప్లావితనేత్రఁ గన్గొని పురాదగ్ధాత్ముఁడౌ తత్పతిన్
దానంబిచ్చి ముదంబుఁ గూర్చిన భవత్కారుణ్యమేనెంతు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"ఏనై వెండియు వచ్చునంతదనుక నిట్లే గుజ్జువై యుండుమం"
చానంబెట్ట నగస్త్యుశాసనము వింధ్యం బౌదలం దాల్చె నా
నీ నామామృతపానభాగ్యమును వర్ణింపఁగ శక్యంబె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

బోనంబై చను రక్కసుం దునిమి నీమూర్తిం బ్రతిష్ఠింప స
మ్మానంబిచ్చితి పీవగస్త్యునకు బ్రహ్మఘ్నత్వముందోఁచి పా

పానేకంబు లడంగుఁ గాదె మది నిన్ ధ్యానించి దర్శింప ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

“హీనుండై సమదృష్టిఁ బత్నులఁ గనండీ బాలిశుం”డంచు న
య్యేణాంకు న్శపియింప దక్షుఁడ భయంబీవేయునం జంద్రు మూ
ర్ధానం దాల్చి క్షయంబు వాపితివి నీదాక్షిణ్యమెంతన్న ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

“పానీయంబమృతమ్మ”యంచును మథింపం బుట్టె నాపాల సం
ద్రానన్ హాలహలంబు భీతిలి నినున్ బ్రార్థింపఁగా దేవదై
త్యానీకంబున కెల్ల రక్షకుఁడ వీవై త్రావి నావంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

“ఈ నేరంబు సహించి దక్షునకు నీవీయంగ మస్తంబు మా
కానందం”బని వేఁడుచున్ సురలు జాయన్ మేషశీర్షంబుఁ గం
ఠానం జిత్రముగా ఘటించి యసుదానం బిచ్చినావంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

శ్వానంబుం గపిఁ బెంచి వేశ్య మెడలం బంధింప నక్షంబు ల
ద్దానన్ వారి కమాత్యరాజతనయత్వం బబ్బదే తొల్లిమో
క్షానం దూగఁడె భక్తుఁ డక్షమును వక్షస్సీమఁ గైసేయ ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

మేనన్ రాజ్ఞి ధరించు నక్షమహిమం బ్రీతాత్ముఁడై వెండియున్
భూనాథుండటు ద్రోహము న్సలిపి ముప్పుం జెంది యావెన్క సు
జ్ఞానం బిచ్చి యురమ్మునందు రుద్రాక్ష ల్దాల్చి మేలందె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ప్రాణాయామవిధిన్ యతింబలెనె నీభక్తుండు రుద్రాక్ష వ
క్షానంగట్టినఁ దత్ప్రభావమున మార్జాలమ్మునుం దెచ్చె సం
తానంబున్ దివినుండి యక్షమహిమ నశక్యంబె వర్ణింప ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

భూనాథుం డొక విప్రబాలు జననీ పూజార్థమై విల్చితే
న్వానిం గంటగ తాఁకుఁజంపుతఱి నధ్వర్యున్ వెసన్ దున్మి శ
ర్వాణీదేవి నృపాత్మజ న్వటున కుద్వాహంబుఁ గావించె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

మౌనిశ్రేష్ఠుఁడు వ్యాసుఁ డచ్యుతుఁడ బ్రహ్మంబంచుఁ జేయెత్తి నిం
బోనాడం గరయుగ్మమట్టె నిలువన్ గోవిందుఁడప్పట్టునన్
వానిం గావఁగ నిన్ను వేఁడఁ గరుణం గాపాడినావంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

సూనుం డొక్కఁడు దల్లిఁ జేరుచుఁ బయస్సు న్వానిమిత్రాళి చం
దానంద్రాగఁగఁ గోరి యేడ్వ సుతునోదార్పంగ నిన్వేఁడు మం
చా నారీమణి దెల్ప నీయవొకొ దుగ్ధాబ్ధిన్నినున్వేఁడ ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

మానంబూని మృకండసూనుఁడు నినున్ మైపారవశ్యంబునన్
ధ్యానంబుంచి భజించుచున్నతఱి నా ధర్ముండు రా భీతి నీ
పానం జుట్టఁ జిరాయుఁ జేసితివిగా ప్రత్యక్షమై నీవు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"ఈనాయీప్సిత మిమ్మ"టంచడుగ నట్టె భక్తునిం దన్ను భ
ల్లాణుం బ్రీతి సపుత్రుఁ జేయుఁజని భార్యంగోరి యాతండిడన్

సూనాస్త్రాభశశిత్వమూను విటరాజు న్నిన్ను సేవింతు ల
శ్రీమన్నారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

వాణిజ్యార్థము పోవువైశ్యుఁ డటవిన్ వాంఛించి నీమూర్తి యూ
స్థానంబందున లేమిఁ గుంచమిడి యర్చల్ సల్పి పోనుండ నా
కోన న్వాని హితు ల్వెలుంగు పడ నాకుంచేశ్వరుండైతి ల
శ్రీమన్నారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

“బోనం బీతఁడొసంగినం దినకుమీ మోసంబగున్ శర్వుపై
నానం బెట్టితి”నంచు భాస్కరుని నాహారమ్ము మాన్పించి చో
ళానంతాధిపుఁడీ జగమ్మెఱుఁగ భక్త్యావేశముంజాటె ల
శ్రీమన్నారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

“కాసీ చూతము వీని గర్వమిటకుం గావేరిఁ గట్టంగ నే
లానేస్తుఁడయి రాడ”టంచు నినుఁగొల్వన్ ఱేఁడు ముక్కంటి దు
ర్మానంబున్ హరియించి ఱేని పనుపు స్మన్నింపఁగా లేదె ల
శ్రీమన్నారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

“ప్రాణంబున్నఁ దినంగవచ్చు బలుసాకం” చాడరే పెద్ద లే
లా నీ వట్లు ఖిలపరిహారముల పాలైనావో పిట్టవ్వకై
యే నోముల్ మునునోఁచె నా జరఠ స్వామీ నిన్ను మెప్పింప ల
శ్రీమన్నారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

“పైనై నీవిడ నారగింతు నిట నీయింట న్సదా నిశ్చయం
బా”నంచుం గరికాళునిం దనిపితౌరా భక్తవాత్సల్య మీ
వేనై నీకిడ నారగింప నిట నాయింటం గొనన్ రావ ల
శ్రీమన్నారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

భూనాథుండొకఁ డెప్డు నిన్ననువరంబుంగాంచి యొక్కంట నిన్
గానన్ లేక వియోగతాపమున ఖడ్గంబూని చేయెత్తి మూ
ర్ధానన్ వైచుకొనం గడంగునెడ చెంతన్నిల్చి నావంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

దానోద్రేకమునన్ గజంబొకటి మర్త్యవ్రాతముం జంపుచున్
లోనై నిల్వమిఁ జోళరాజొకఁడు నిన్నుం జిత్తమందెంచుచుం
బోనీ కా తఱి మత్తవారణమదమ్మున్ ద్రోచి నాడంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"ఏ నర్చించెదఁ గోటిలింగముల దేవేశు న్మదిన్నిల్పి సూ
నాళీకంబుల"నంచు బాసనిడి పుష్పాభావముం జూచి ధై
ర్యానన్ జోళుఁడు మస్తమీయ దయమీఱన్ బ్రోవఁగాలేదె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ఏ నీలేఁగను జంపినందున ఫలం బీ నాఁడు నా తండ్రి నా
కానం బెట్టక మున్నె కాంతునని తానై ప్రాణములీవ్వడ రా
ట్సూనునున్ వత్సముఁ గూడఁబ్రోచి యిడవే క్షోణీంద్రుఁడర్థింప ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"దీనున్ బాలుసడంచె నశ్వ"మని పృథ్వీశాత్మజుం డాపయిన్
రాణుల్ మంత్రికుమార పత్నులు నిజప్రాణమ్ము లొక్కమ్మడిన్
బోనాడం గని మన్పితెల్లరను నిన్ భూపుండు ప్రార్థింప ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

'పూనెన్ మామిడిపండ్ల కోర్కెలెడఁదం బూరింపుమా' యంచు నీ
వేనా కోరితి వట్లకాలమున సామీ భైరవున్ జింతచె

ట్టైనన్ మావిఫలమ్ము లిచ్చెఁగద వాఁడర్చింప నిన్భక్తి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

సూనంబొక్కటి తక్కువౌటఁగని రాట్సూనుండు వెయ్యింట నీ
"నానేమమ్మున కిట్టి లోపమొదవంగాఁ జెల్లునే" యంచు ఖ
డ్గానన్ మస్తము నీయ మెచ్చిమనుపంగాలేదె భూతేశ ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ఆనందాబ్ధి మునింగి దాసి పరిచర్యన్ వీడ భంగించె నా
సానిన్ తేఁడు విటత్వమూని నృపుమాత్సర్యంబుఁ బోకార్ప దా
పై నీలాలకఁ జేసితౌగద భుజిష్యన్ మేలు నీలీల ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

సూనుల్ నూర్వు రకాలమృత్యుహతులౌ శోకమ్ము నాపంగలే
కా నా డట్లు వసిష్ఠమౌని నిను సంప్రార్థింపఁగా మెచ్చి ని
త్యానందమ్మున కాళహస్తి నిలయుండై నావు మేల్మేలు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

వాణీనాధుఁడు పుత్రులెల్లరను జంపంగ్రూరుఁడై పుత్రహ
త్యాసేకాఘశతమ్ము పీడనము సేయ న్నిన్ను వేఁడన్ సుసం
తానమ్మిచ్చి యఘంబుఁ బాపితివిగాదా లోకముల్మెచ్చ ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

తానల్లెన్ గుడి నీకుఁ దంతువుల చేతం జెల్లి పెన్భక్తి య
వ్వానిన్నీ వటు గాల్ప నా పురువుచెంతన్ దీవియన్గాంచి కో
పానన్ మ్రింగఁగరా నొసంగితివి గైవల్యమ్ము చిత్రమ్ము ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ఏనుంగొక్కటి పత్రపుష్పఫలముల్ హృద్యంబుగాఁ దెచ్చి నిన్
దా నర్చింపఁదదర్చకు న్సలిపె విఘ్నుంబొందు వ్యాళమ్ము గో
పానన్ సర్పముఁజంపి తాఁబొలిసి చేపట్టెంగదా ముక్తి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"ఏనై పూజలుసేయ రత్నములతో నెవ్వాఁడో దుష్టుండు దా
వానిన్ ద్రోఁచి ఫలప్రసూన దళముల్ పైఁ బెట్టెఁ దూలింతు నే
నీ నాఁ"డంచు వధించి వైరికరి వ్యాళేశుండు నిన్పొందె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

స్నానంబాడి సమర్చనల్ సలిపి నిచ్చల్ గీర్తనల్సేయుచున్
సేనానీవచనానుసారమున నిన్ సేవింప రౌప్యాద్రిపై
నానత్కురుని కుష్ఠముం దొలఁగఁజేయ న్నేర్చినావౌర ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"వానింగూడుము పీనిఁగూడు"మని చల్పాదింపఁగాఁ దల్లి య
ద్దానిన్ సైపఁగ లేక వారవనితాద్వంద్వమ్ము ప్రాయమ్ము నీ
కై నైవేద్యమొనర్ప నిచ్చితివిగా కైలాసవాసమ్ము ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

స్తేనవ్రాతము గొల్లఁగొట్ట గృహముంజేరంగ వార్తాకముల్
బూనెన్ వస్త్రమునందుఁజుట్టి మెడపై బోనంపువేళన్ భయం
బె నిన్ వేఁడఁగ వంగకాయలట లింగాకారముంబొందె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"నానేమంచిది నేటి ముగ్గురకు రత్నంబుల్ వలె న్దెమ్ము నీ
కీనేర్పున్ గలదేని" యన్న బసవండీక్షించి ధ్యానించు మా

త్రాణన్ జొన్నల ముత్తెముల్సలుపు వింతల్ సెల్లెరా నీకు ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

“మానేమం బిది శక్తి నీకు గలుగన్నాకిమ్ము గోశృంగముల్
పై నీశన్ గయిసేయ బిల్వదళముల్ వైళంబ”యంచాడ భ
క్తానీకార్థముగొడ్డుమోపిడుగాని యీయన్ లేదె యొక్కండు ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

“ఈ నా యీప్సితమిమ్ము నీవు బసవా యిడ్డన్న సంతుష్టిగాఁ
దా నీఁజాలిన వాఁ”డటం చసమనేత్రుం బీవు యాచింప న
ద్దాన న్నీశను నీకెనూపఁడె యథార్థంబేర్పడ న్నాఁడు ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

స్థానీయంబునఁ గాలు జాఱి బసవేశా యన్న భూపాలకా
స్థానంబందునఁ గూరుచుండి విని ముంతంబట్టి నోపీ పరి
త్రాణంబుం బొనరింప నేర్చె బసవోద్యద్భక్తి సంపత్తి ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

జ్ఞానుల్ భక్తులు వీరువీరనుచు హర్షంబొప్ప విన్పించి “శ
ర్వాణీ! చూడు”మటంచు నీవెడఁదఁజీల్పం దద్గతుం ద్వత్పద
ధ్యానానందమయాత్ముఁడౌ బసవనిం దా గౌరి వీక్షించె ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

సూనుండెట్లగుఁ దల్లిలేనియెడ నంచున్ భక్తురాలోర్తు తాఁ
బూనెన్ నిన్బెనుపంగఁ దల్లివలె నా పూజ్యం బరీక్షించి ని
ర్వాణం బిచ్చితివీవు సాపడమిఁ జావన్ సిద్ధమైయుండ ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"ఏ నీయంగను పాలు ద్రావ విది యేమీ సామి నీ వానవే
నానంబెట్టెద నన్నుఁ జంపుకొని తిన్న"ట్లంచుఁ బోర్వెట్ట నా
కూనంగాచి పయస్సుఁ గ్రోలితివిగా కుంచెండు నిత్యంబు ల
క్ష్మీనారాయణశాస్త్రిహృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

కానన్నీవొక జీర్ణ గేహమున ప్రమగ్గంజూచి నీకోసమై
తానూత్న మ్ముగ నాలయాదుల నగ ట్టంజేసి దీపంబు లో
నైనం బెన్నెరులిచ్చు భక్తునకు నిత్యత్వంబిడన్ లేదె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీ నాట్యంబుననుండు రూపు రుజచే నీకబ్బెనంచొక్కరుం
డీనేర్పైన్ శిరమే చికిత్సలు ఫలంబీకున్న నప్పట్టునన్
నీనై జంబగు రూపుఁజూపి యతనిం జేపట్టినావంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

కానన్ భక్తుఁ బరీక్షఁజేసి యొక వృక్షచ్ఛాయలో నిల్పి నీ
వానంబెట్టుచు నాజకంబు గిరిలోయ న్మేపు గొల్లండవై
వానింబ్రోచి సుఖమ్ములిచ్చితివిగావా భక్తి మెప్పింప ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ఏనుంగొండు మదించి పాటె నిను నర్చింపంగఁ బుష్పంబులం
దేనై యేగెడు భక్తునిం జదుపఁ దానే కారణంబంచు పృ
థ్వీనాథుండసువుల్ దొఱంగునెడ ముక్తిన్ వానికీవొక్క ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

హా! నీ చిత్తము దారువో శిలయొ లోహమ్మొక్కొ వజ్రంబొకో
"సూనుంగోసి భుజింపఁబెట్టు"మనుచున్ శోధించి వేధించెదే

యీనేమంబులు నీ నృశంసతలు నీకే చెల్లు నో చెల్ల! ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"ఏనై పోరజయింబెవండు గను వాఁడే దీని కర్హుం"డటం
చా నాఁ డీవొక బోయవై నరునితో నాలంబుఁగావించి డెం
దానన్ వానికి మెచ్చి పాశుపత దానంబీయఁగాలేదె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"నానేస్తుండును బోయె పర్వమని చింతల్ దక్కి యిక్కన్యపై
నే నొక్కండనె పాపి"నంచొకరుఁడా నిద్రించు వేశ్యాస్తనం
బే నావేల్పని మ్రొక్క లింగమయి నీవేతోఁచి తాచంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

భూనాథాగ్రిణి పత్ని దేవళమునం బూల్ద్రుంప పూజారి తత్
ప్రాణమ్ముల్ కరయుగ్మమా నృపతియున్ ఖండింపఁగా మెచ్చి రా
జ్ఞీ నాసాకరయుగ్మ మీవొసఁగి రక్షింపంగ లేదొక్కొ ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

బాణుండారసహస్ర బాహువుల సద్భక్తి న్నివాళించి ఖ
డ్గానంద్రెవ్వఁగఁజేసి నిన్నుఁ దనుపం గర్మంబిదేయన్న చం
దానన్ వాకిటఁ గాఁపుగాచితట గాదా వాఁడు గోరంగ ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

మీనమ్ముల్ వలఁజిక్కముందుఁబడు నమ్మీనుల్ శివప్రీతిగా
తానీరంబున వైచి శేషమున సంతానమ్ము రక్షించు నీ
మానన్ భక్తుఁడు నిన్ భజింపఁగని సమ్మానింప మీనైతి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

వానన్ జచ్చుచునుంటి నేననుచుఁ జెప్పన్ భక్తుఁడొక్కండు వ
స్త్రాన్ జుట్టియుఁ బాకఁగాల్చి చలిఁ దీరంజేయ నీవంతటన్
బోనంబిమ్మన నాతఁడిచ్చి తనుసన్ మోక్షంబిడన్ లేదె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

“ఏనెట్టైననుజేతు శైవు మునుఁ దానీశాను భక్తుండు గాఁ
డే నొండైన వధించువాఁడ”నని పృథ్వీశుండు వర్తింప వే
సానన్ డగ్గఱి బాసలోఁ తరసి మెచ్చన్ లేదె యాతేని ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

తానీభక్తులకర్చఁజేసి నిజవిత్తంబెల్లఁ బోకార్పఁగా
వీణంబాడఁగనిచ్చి యాతఁడు దినన్ విత్తంబులందించి గౌ
రీనాథాయని పిల్వ నోయనెద నేరీ నీకు సాటెన్న ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీనామంబుఁ బఠించు జంగములఁ బున్నెంబంచుఁ బూజింపఁగా
లోనై పూర్వకృతాఘరాసు లవి డుల్లన్ దొల్లి నీభక్తుఁడే
గా నిర్ముక్తులఁజేసి శాపహతులౌ గంధర్వులంబ్రోచె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

స్నానార్థంబుగ నీదు నాలయము చెంతన్ భక్తసంతుష్టికై
కోనేటిన్ జనుపాంథుఁడొక్కరుఁడు నీకుండొల్లి కల్పింపఁగా
దే, నిన్నుంగనుదృష్టిఁగాంచి సుఖియై యేపారఁగానేర్చె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీనామమ్మున నేమి వింతగలదో నిశ్శ్రేయసప్రాప్తికై
మానుల్ దుస్తరరోగముక్తికొఱకై మాబోంట్లు సేవింత్రు శూ

లానన్ భక్తుని శూలఁబోనడిచి యేలన్ లేదె దిక్కేల ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"నీనేమంబులకోసమేము దినమున్నేతిన్ సమర్పింతుమే
మానంగాఁదగు"నంచుఁ బౌరులుడుపన్ "మద్భక్తిఁగల్గంగ నీ
రే నేయా"నని వేయిదీపములు నీకీలేదె యొక్కండు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"ఈనీచంబగు బౌద్ధజైనములఁ ద్రుంగింపంగదే"యంచు సిన్
దానీమంబుగ ఔలరువ్వి దినమున్ దండింపఁగా నొక్కఁడా
వైనంబెంచి వరంబులిచ్చితివి గావా భక్తునిం దన్పి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

మ్రానుంగాల్పఁగ మంత్రతంత్రములచే మర్మంబులంగూర్చి యా
జైనుల్ నీపదభక్తుఁడొక్కరుఁడు భస్మంబల్లనం జల్లఁగా
మ్రానై వెండియునిల్చెఁ; బూది జగముల్ మ్రందించుఁబుట్టించు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

బానన్ సర్పముఁదాఁచి జైనులు భవద్భక్తుంబరీక్షింపఁగాఁ
"గానీచూచెద మీశుఁడిందుగలఁడే కన్పింపుమా"యన్నఁగుం
భానన్ భక్తుఁడు సేయివెట్ట స్ఫటికంబై తోఁచినావంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

జైనుల్ నీ పదభక్తునందు నొకనిన్ "శైవాలయంబిద్ది యీ
శానుండీతఁడె" యంచు ముండిత శిరస్సంస్పర్శఁ జేయింపఁ ద
జ్జైనాహంకృతి మాయలింగమయి తోఁచన్ లేదె నీవందు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీ నామంబు స్మరింపరాదనుచుఁ బట్టిన్ జైనుఁ డొక్కండు గో
పానన్ హింసలువెట్టుచుండ మది నాప్యాయమ్ము సంధిల్లఁగా
బోనం బాసతి చంకబిడ్డవగుచుం బోసేసినావంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"జైనుం జంపె"నటంచు రామనొకతెన్ జ్యాభర్త తద్గ్రీవ ఖ
డ్గానన్ దున్మెడువేళ నావనిత సాఁకన్ భిన్నలింగాకృతిం
గాన న్వచ్చి తటాల్న లోఁగొనవె లింగానన్నరుల్ దోఁప ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"ఏనొల్లన్విన నన్యదైవముల నుంతేనిన్ స్పృశింపంగ నే
జైనవ్రాతమునొల్ల"నన్న నొక రేడ్ స్వప్నంబున న్మట్టి న
ల్లై నీభక్తుఁడు మేనుఁగాల్చి పెనమం దల్లంత నిన్ జేరె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

కానన్ లేక జగమ్ము "విష్ణుఁ"డనుచుం "గాదీశుఁ"డంచున్ భిదల్
పూనంజూచునుగాని మీకుఁ గలుగంబోదింత భేదమ్ము రాఁ
డే నిన్ గొల్వమురారి దొల్లి శివభక్తిచ్ఛన్ బ్రవర్తించి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"నానోటంబడి యాల్గిరెందఱో జనుల్ నాశౌర్యముంజూప ని
వ్వానిన్ బట్టుదు"నంచుఁ బామొకఁడు నీభక్తాగ్రణిన్ ముట్టితా
క్షోణింద్రెళ్లదె నీదుభక్తులకు నక్షుద్రమ్ము నీరక్ష ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీనామం బపవర్గరాజ్యపదవీనిశ్శ్రేణియై యుండఁగా
జ్ఞానంబేటికి కర్మలేల నిగమస్వాధ్యాయమేలా భవుల్

గానంజాలరు గుక్కచే శ్రుతులు బల్కంజేయవే తొల్లి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీనామమ్ము జపించువారలకు నౌనే సాటిసెప్పంగ భూ
మీనాన్నై లింపగణమ్ము నొక్కడఁ దులన్ మీభక్తుచెప్పొక్కడం
గా నిల్పన్ ములుసూపె చెప్పుదెస నిక్కంబిద్ది నిక్కంబు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

మేనంగుష్ఠము సంభవింపఁ బడలేమిన్ బాధ నీభక్తసం
తానంబుల్ జలకమ్ములాడి చనుమీఁదన్ జేరి యొక్కండుదా
నానీరమ్ముల ముస్గి స్వర్ణమయ దేహంబూనఁడే తొల్లి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీనామమ్ము జపించియున్ తనువుల న్నీ చిహ్నముల్ దాల్చియున్
నీనిశ్రేయస సౌఖ్యమగ్నమతులై నీభక్తులుండంగ నే
లా నీచుల్ నిను నిందసేసి నిరయంబందంగ నూహింత్రో ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీనేమంబది బొచ్చె చేతఁగొనకే నీవన్నము న్మృష్టవం
చేనాఁడో వినియున్న సుద్ది నిజమాయెం దొల్లి యాబెయ్యమాం
సానన్ బోగయయింట నోగిరము నిచ్చున్ మెక్కుటంజేసి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ప్రాణేశు న్మదిలోన నిల్పికొని సౌరాష్ట్రింబుఁజేరంగఁబోఁ
దానూహించియునేఁగి కుష్ఠమున బాధన్ బొందుచుండ్రోవ "గౌ
రీనాథా"యని వేఁడ నొక్కరిత కార్తింబాపినావంట ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

కానన్ గోపకుఁడొక్కరుం డిసుకతోఁ గల్పించి లింగమ్ము ద
గ్ధానన్ నీకభిషేచనమ్మొనరుపంగాఁ దండ్రి వీక్షించి పా
దానం దన్నఁగఁ ద్రుంచి నీకృపకుఁ బాత్రత్వంబుఁ గై కొండె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా ॥

నీనామంబు జపించునా బసవఁడే నిశ్చింతుఁడై పెన్విసం
బానన్ గట్టునఁ ద్రేన్చె చెక్కుచెదరం డావింతయే వింతగా
కానాఁ డీవలకాలకూటవిష మాహారించుటే వింత! ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

వానల్ నీకరుణారసమ్ము, పొలముల్ భక్తాంతరంగమ్ము, నీ
ధ్యానంబన్నదె విత్తు, ముక్తిపద సస్యవ్రాతముల్ పండు నా
వానల్ విత్తులుదున్నుటల్ వలెనె నీభక్తాళి జీవింప ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

శ్వానంబొక్కటి కాటిలోఁ దిరిగి భస్మం బంఘ్రులంటంగ మా
ర్గానంబోవుచు నంఘ్రిసక్తరజముల్ రాల్పంగ శీర్షమ్మునం
బ్రాణంబుల్ విడనున్న వాఁ డొకఁడు మున్ బ్రాపింపఁడేముక్తి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

కానంజేరియు గ్రామమంత వెలిద్రొక్కన్ దిండిలేమిన్ గళా
హీనుండొక్కఁడు తప్తగోమయముఁ దానీక్షించి మ్రింగన్ సుధా
పానంబై యది వాని కిచ్చెఁ గద కైవల్యంబు నానాఁడు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

శ్వానంబుంగొనిపోయి బోయ పనిఁ గన్పట్టంగ రుద్రాక్ష హా
స్నానంగుక్కమెడన్ ఘటించి యటమీఁదన్ ఘోణిచేఁజచ్చి యా

శ్వానంబాతఁడు ముక్తులైరనఁగ నక్షంబెంతకుంజాలు! ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీనామమ్ముఁబఠించు భార్యఁ గవయం జేయెత్తి తద్భ్రాత్రి మా
తాత్రినమ్ముట్టిన మాత్ర బగ్గుమనుదుర్ దత్కాంత బోధింప రా
ట్సూనుండంత పఠించి నీమనువు సంశుద్ధుండుగాలేదె ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీ నిర్వ్యాజకృపాకటాక్షమును వర్ణింపంగ శక్యంబె య
ధ్వానశ్రాంతను భక్తురాలిని పతత్రిచ్ఛాయచేఁగప్పు మా
త్రానం బక్షికిఁగూడ ముక్తి నిడు దాతల్లేరు నీకన్న ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ఏనాఁడెట్టి తపంబొనర్చిరో కో! వారే మాకుఁ బ్రత్యక్షులౌ
స్థాణుల్ జంగమలింగమూర్తు;లల భక్తవ్రాత భుక్తోజ్ఝితం
బై నంగ్రేణియొనర్పఁజాలు నమృతాహారత్వభోగమ్ము ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ప్రాణేశుండగు లింగబంధనముగోయన్ గూళలెవ్వారో ర
క్తానంద్రాడుమునుంగ దీర్ఘమగు నిద్రంబొందె మాచయ్య గం
తానన్ లింగము గట్టినంతటనె ప్రాణాల్ వచ్చెఁ జిత్రమ్ము ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ప్రాణంబీవె సమస్త భక్తతతికిం బ్రాణంబనన్ లింగమే
యౌ; నాఁడా కమలవ్వలింగమును బాయన్ బ్రాణముల్వాయదే
ప్రాణంబుల్ వెసరావె లింగమునఁ జెప్పన్ జిట్టలైవెండి ల
శ్రీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

తానై బాలునిలింగ మెచ్చుటనొ క్రిందన్ జాఱిపోఁగా గత
ప్రాణుండౌట నెఱింగి తోడి చెలికాండ్రందొక్కఁ డాలింగమున్
నేనే దాఁచితినంచుఁ గేల్కొలుప వెండిన్ లేచె బాలుండు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"ఏనోభారము మోయజాలను శివా! యేతెంచె దుష్కాలమీ
గ్లానింబాపవె వారువమ్మనగుదుం గాపాడవే" యంచు నిన్
దీనత్వమ్మున వేఁడు ధర్మవును ముం జేపట్టఁగాలేదె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ఆనెన్ మద్యము, గూడె నీడిగను గామాంధుండు పారుండు నీ
చే నిశ్శ్రేయసమందె భూపనిశితాసిచ్ఛిన్నుఁడై మద్యభాం
డానం బూవులుదెచ్చి పూజకిడు పుణ్యానంగదా తొల్లి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీనిష్ఠాపరమైన భక్తతతికిన్ నిత్యమ్ము మృష్టాన్నముల్
దా నీవచ్చినవేగదన్న కలుముల్; గై కూలికేతయ్య ని
ష్ఠానాశమ్మున కోడి తాఁ గుడువఁబెట్టలేదె శీర్షమ్ము ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

క్షోణీశన్ భక్తులకెల్ల రొక్కములు నెక్కుండైన యర్థంబులున్
దానంబిచ్చెడు మేటి యా బసవఁడే త్వద్భక్తులం దొజ్జ, గా
దేనిం బత్నిపటమ్ములూడ్చి సభలో నెట్లీయఁగానేర్చు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"భోనంబుం దినసీయు దీ విసము మా భూతేశుకంఠస్థమై
దీనిన్ నేఁడెగఁగోసివైతు" నని కత్తిందాల్చి నీభక్తుఁడ

జ్ఞానన్ వచ్చిన నంకమందునిచి చేయన్ లేదె తద్రక్ష ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

ప్రాణంబుల్ భవదంఘ్రిపూజనలు సేయంగల్గునందన్క నే
పూనున్ భక్తుఁడు, పూజలేని తనువున్ బూనంగనేలంచు ని
ష్ఠానిర్వర్తనకోస మొక్కసతి మేన్ సర్వాంగదా దివ్వె ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నీనిష్ఠల్ వచరించు వారి కభవా నీభక్తులే శంకరుల్
నీనిష్ఠల్ వెలియైనచోట సుతపత్నీ భ్రాంతియుం బూనలే,
రానాఁ డాలి కరమ్ములం దునుమలేదా భక్తుఁడొక్కండు ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

"ఏనాఁడో గరళంబుమెక్కి శివుడం చీరజ్జులాకేటికిం
గానీ యీ విషముష్టిపండొకటి మెక్కంజేయు" మన్నన్ సఖుల్
దానై భక్తుఁడిడంగ నీవు దినలేదా కాలకంఠేశ ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

నే నీ దివ్యకథామహత్త్వముల వర్ణింపంగ నెట్టోర్తు! న
జ్ఞానిన్ వేమురివాని చాపలయుతున్ సాకంగదే భక్తబం
ధూ! నన్ వేంకటరాము "విశ్వపతయే తుభ్యంనమోస్తం"టి ల
క్ష్మీనారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా॥

సంపూర్ణమ్.

# క థా వి వ ర ణ.

